179 -




Reg. No. 757.

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము ౪ | 1916 సం॥ జూన్ | సంచిక 6

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 | 0 | 0 | సహాయులకు | రు 5 | 0 | 0 |
| పోషకులకు | రు 10 | 0 | 0 | చందాదారులకు | 2 | 0 | 0 |

చంద్రికాముద్రాక్షరశాల, గుంట

Printed at the Chandrika Press, Gun
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధాన పోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విశేషమునసబు, నిడుబ్రోలు.
2 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహద్దరు జమీందారులు, నూజవీడు
3 రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు గారు, నూజవీడు.
4 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దరు మన్నెసుల్తాన్ జమీందారుగారు, ముక్త్యాల
5 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి
6 రామసింగుగారు నెల్లుట్ల సాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల
7 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు.
8 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చొల్లేరు.
9 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట
10 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజంపాడు.
2 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి
3 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి
4 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి
5 తోర్లకొండ హనుమంతరెడ్డిగారు లోలంవర్గ రావేగ్ దారు, యల్లారెడ్డిపల్లె
6 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడికొడ్డి
7 మెదక శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి
8 బాకరాజు పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరము.
9 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ
10 నరసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద
11 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట
12 వెలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల
13 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహసీలుదారు నర్సారావుపేట
14 ఓరుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమిదీపురం
15 ఉల్లగంటిపిం రాఘవరావుగారు, ముక్తాదారు, ఆనేపురం
16 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీల్ దారు-జగితాల
17 పాకుంట శంకరరావు దేశపాండ్యాగారు-జగితాల
18 పట్టువర్ధనం సీతారామరావుగారు-వకీల్-కంభంమెట్టు

# అభినవసరస్వతి

సంపుటము ౮ | జూనమాసము. నలనామ సం॥ జ్యేష్ఠమాసము. | సంచిక 6.

## పీఠాధిపతులు.

పూర్వమొకప్పుడు బౌద్ధచార్వాకాదిదుర్మతశతభూయిష్ఠమై యజ్ఞయాగాదికర్మలకు నిస్సుమంతయు నవకాశములేక యీ యార్యావర్తమంతయు నల్లకల్లోలమై యుండ నీశ్వరాంశచే శ్రీశంకరభగవత్పాదు లవతరించి నిజవిద్యాతపోమాహాత్మ్యమువలనను రాజసాహాయ్యమువలనను దద్దుర్మతములనన్నింటిని నిర్మూలముచేసి మన్మతాత్మకముగ శుద్ధాద్వైతముఁ స్థాపించి తన్మతప్రచారమునకును నాచారవ్యవస్థాపనకును ద్వారకా జగన్నాథ బదరికాశ్రమ శృంగగిరులయం దాచార్యపీఠముల నెలకొల్పిరి. తక్కినమూడు దేశాంతర సంబంధముగలవైనను శృంగగిరిపీఠముమాత్ర మీమధ్యదేశమునకంతటికిని నాచారవ్యవస్థాపనయం దధికారముగలిగియున్నయది. తరువాతఁ బుష్పగిరి విరూపాక్షాదిపీఠములు కొన్ని తదంతశ్శాఖలుగా బయలువెడలి యా యా భాగములఁ కధికృతివహించి విరాజిల్లుచున్నవి. అందలిహంపివిరూపాక్షపీఠమునుండి శాలివాహనశకము ౧౬౬౫ సంవత్సరమున నుద్దండనృసింహభారతీస్వాములకాలములో మఱియొకపీఠ మభినవవిరూపాక్షసంజ్ఞతో సృష్టింపఁబడి గౌతమీప్రాంతభూముల నాచారవ్యవస్థకై పనుపఁబడియెను. కాకరపర్తిపీఠమను నామాంతరముగల యీయభినవవిరూపాక్షపీఠము హంపివిరూపాక్షపీఠాధిపతుల యాజ్ఞశిరసావహించుచు సుమారు ౧౦-౧౫ సంవత్సరముల క్రిందట మండపేటలో సిద్ధిఁబొందిన శ్రీవిద్యానృసింహశంకరభారతీస్వాములవఱకు పరంపరగా వచ్చుచుండెను. ఈ స్వాములవారు దేహమును విడుచుసమయమునకుఁ దత్పీఠాధికృతికిఁదగినశిష్యుఁడు దొరకమినో యుపదేశముచేసి శిష్యుని బీఠస్థుఁజేసియేగునంతటిస్థితి యీ చరమదశయందుఁ దటస్థింపమినో యీపీఠము రాజకంబయ్యె. తదుపరి రాణీచయనులను నొకవిద్వాంసుఁడు తనపాండిత్యాతిశయముచే నా మండపేటబ్రాహ్మణుల వశపఱచుకొనినవాఁడై విద్యానృసింహశంకరభారతీస్వాములచేఁ దనపేర వుయిల్ వ్రాయఁబడినట్లొకటి సృష్టించి బోధానందస్వామి నామముతోఁ దత్పీఠముఁ స్వాధీనముచేసికొనుటయు శ్రీహంపివిరూపాక్షస్వాములవారివలన నభినవవిరూపాక్షపీఠమునకుఁ గ్రమమైనయధికారమునుబొందిన శ్రీసచ్చిదా

నందశంకరభారతిస్వాములవారు బోధానందస్వాములవారిపై నభినవవిరూపాక్షపీఠమును దన కధీనపఱుపవలసినదిగాఁ దెచ్చినవ్యవహారములో రాజమండ్రి యడిషనలు టెంపొరరీసబుకోర్టువారు 6-9-15 వ తేదీని బోధానందస్వామిదాఖల్ చేసిన వుయిల్ విద్యానృసింహశంకరభారతీస్వామి వ్రాసియిచ్చినట్టు రుజువుకాలేదనియు మండపేటబ్రాహ్మణులకు పీఠాధికారి నేర్పఱచుట కధికారములేదనియు హంపివిరూపాక్షస్వాములవారిచ్చిన యధికారమునుబట్టి గోదావరిమండలమందలి యాచారవ్యవస్థాపనకు సచ్చిదానందశంకరభారతీస్వాములే యర్హులనియుఁ దీర్మానించియున్నవారు. ఇదియునుంగాక బోధానందస్వాములవారు హంపివిరూపాక్షపీఠమే తమదనితెచ్చిన యక్రమపువ్యవహారముఁ గొట్టివేయఁబడియె. యాథార్థ్యమంతయు నిట్లులుండ నాబోధానందస్వామి (రాణీస్వాములవారు) బెజవాడ సికింద్రాబాదామున్నగు పట్టణములకేగి తమమహాశివిద్యామహత్త్వమువలనఁ గొందఱజనుల వశపఱచుకొనుచుఁ గొందఱతో నభినవవిరూపాక్షపీఠాధిపతిననియుఁ గొందఱతో హంపీవిరూపాక్షపీఠాధిపతి నేననియుఁ జెప్పి గడబిడపెట్టి పైపీఠస్థులిరువురునుస్వీకరింపఁదగిన సేవాసత్కారాదులందుకొనుచున్నట్లు వినుచున్నవారము. యతులు పూజ్యులనునభిప్రాయముతో రాణీస్వాములగారి నెంతగౌరవించినను నిరాక్షేపముకాని పీఠాధిపతులనుభ్రాంతితో, సత్క్రియలు మొనర్తురైనవియిచ్చుటమాత్ర మవిచారితమైనపని, ఈపని రాణీస్వాములవారికి గౌరవప్రదమును హంపీవిరూపాక్షస్వాములవారికి నగౌరవప్రదము నైయున్నది. శంకరుల నాఁటినుండియుఁ బరంపరగావచ్చెడి మనయాచార్యపీఠముల నగౌరవపఱచుటయుఁ బీఠాధిపతులుగానివారికిఁ బీఠాధిపతిత్వగౌరవము నొసంగుటయు మనకెంతశ్రేయోదాయకమైనకార్యమో బుద్ధిమంతులకుఁ దెలియకయుండదు. కాని రాణీస్వాములవారి మాటలచే యాథార్థ్యము నెఱుఁగక మోసపోవుచుండవచ్చును. కావునఁ దత్త్వజిజ్ఞాసువు లీవ్యాసముం జదివి న్యాయపథమును విడనాడకుందురుగాత. ఈ తెలిపినయంశములందుఁగూడఁ గొందఱకసత్యత్వభ్రాంతి యుండవచ్చును. ఆభ్రాంతినశించి సత్యతాబుద్ధి కలుగుటకుఁ దగినప్రమాణము లొకపరి పత్రికాముఖమునఁ బ్రకటింతుము.

## యతినిందకులు

వంగవోలుతాలూకా కొప్పెరప్పాడు గ్రామనివాసియగు పొన్నలూరు రామయ్యవ్రాసిన శ్రీ పుష్పగిరిస్వాములవారిమీఁది నిందావ్యాసము కృష్ణలోఁ బడనయ్యెను మిడుతలదండును స్వాములవారిపరివారమును నుపమానోపమేయములఁగాఁ జేసిన యాపురుషుని యలంకారపాండిత్య మెంతయోని కొనియాడఁదగియున్నయది. ఇండియాయంత

టికిని వెన్నియో సౌఖ్యలతలు మొలిపించి యల్లుకొనఁజేసిన యింగ్లీషువారిమొదలనే కొందఱు కృతఘ్నత వహించుచుండ స్వాములవారివలన దేశమునకుఁ గాని మతమునకుఁ గాని ప్రయోజనము లేదని యీజనుఁడు వ్రాయుచ్చుట వింతవిషయము కాదు. "అహర్నిశాదులు వారును వారిపరివారమును ధనార్జనసదుపాయములనే విచారించుచుందురు కాని దేశహితైకసంభాషణమే యియ్యముచ్చటించువారొక్కరైనను లేరని యితఁడువ్రాసినది పిచ్చివ్రాత. దేశహితమునకుఁ బాటుపడు పవిత్రాత్ములహర్నిశము ధనార్జనసదుపాయములు విచారించుకో వర్ణాశ్రమవ్యవస్థచే దేశహితమాపాదించు స్వాములవారును వట్టే విచారింతురు. చరిత్రజ్ఞానశూన్యులును బండితంమన్యులును నగు నీదృశ్నవనాగరికుల కనేకులకు సన్యాసుల కీ గజతురగాందోళికాది పరివారమెందులకను నల్పశంక లుదయించుచున్నమాట నిజము. కాని పరివారవిహీనముగా భైక్ష్యమాచరించుచుఁ బర్యటింపవలసినవారు కేవల స్వసంతరణార్థమై సన్యసించినయతులు గాని శంకరగురుపరంపరాగతులై వర్ణాశ్రమధర్మవ్యవస్థాపనయం దధికృతులైన మతస్వాములు కారు. ప్రజాపరిపాలనమునఁ బ్రభువుల కెంత యధికారమో వర్ణాశ్రమధర్మనిర్ణయమునఁ బీఠాధిపతుల కంత యధికారము- నిగ్రహానుగ్రహసౌకర్యమునకుఁ బరివారముతోఁ బ్రభువుల కెంతయావశ్యకతయో మతప్రభువులకును నంతయావశ్యకత-పరిపాలకులగు ప్రభువులకుఁ బన్నుగట్టుటయందుఁ బ్రజల కెంత బాధ్యతయో యాచారవ్యవస్థాపకులగు యతీశ్వరుల విషయమైకూడ నంత బాధ్యత. ఇట్లు ధరాధిపతులయధికారముతో పాటు పీఠాధిపతుల యధికారమును మొదటినుండియు వచ్చుచున్నయది. అందువలననే భారతనమువారు స్వాములవారిశాసన మవశ్యంభావ్యముగ నంగీకరించుచు దాముడు గౌరవభావముం జూపుచున్నవారు. క్రమాగతముగు నిట్టి నిరంకుశాధికారమే లేక యీలాటి యవ్యక్తపువ్యాసములకే తలక్రిందగువారైన ధర్మపరిపాలనముగల యీ బ్రిటీషు రాజ్యమున నింతపరివారముతో నూరూర డంకామీఁద దెబ్బవేయించుచు నెట్లు సంచరింపఁగలుగుదురు? ద్విజాతులెల్లరును దప్పనిసరిగా వారికి, పట్టీశీల చెల్లింతురు? వారు విధించెడి బహిష్కారాదు లేరీతి సాగఁగలవు? ఇంక జనుల యాచారవ్యవహారముల సరిగవిచారించి యనాచారపరులఁ దగురీతి శిక్షించుట లేదనియు సంస్థానమందుండవలసిన పద్ధతులుకొన్ని సరిగా నుండుటలేదనియు నీమొదలగు నెపములు కొన్ని వెట్టి పెద్దమనుష్యులే కొందఱు స్వాములవారివిషయమున ననిష్టభావముఁ జూపించుచున్నారు- ఇట్టిభావములు పరిపాలకులపట్లఁగూడఁ గొందఱు ప్రజలకుఁ గలిగియుండుటయు నందులకుఁ గాను మండలసభలు మొదలైనవి చేసి ప్రభువులకు నివేదించుకొనుచుండుటయు నవి క్రమమైనవనియో యక్రమమైనవనియో చెవినిబెట్టియుఁ బెట్టక వారిచ్చవచ్చినట్లు వారేగుచుండుటయు

నంద జెలిఁగినవిషయమే కావునఁ బరిపాలకులయొక్కయుఁ బరిపాల్యులయొక్కయు భావము లన్నివిషయములలోను నేకీభవించియుండుట కడుఁగష్టము. యీవలనుండి యెన్నియేని శ్రీరంగనీతులు చెప్పవచ్చునుగాని యేదియో యొకయాజమాన్యమును నెత్తి నివేసికొనియుండువారు సాధ్యమైనంతవఱకు ధర్మాతిక్రమణముగాకుండఁ దమవీలును బట్టి యేగకతప్పదు. మనకు మిక్కిలి కష్టనష్టములుగలిగించు నట్టియంశము లేమేని యున్న భక్తిపురస్సరంబుగ వానివిషయమై మనవినంపుకొనవలె. ఎటులో చక్కఁబెట్టుకొనవలెఁగాని యిట్టిపిచ్చిపిచ్చివ్యాజ్యములు ప్రకటించియా పీఠాధిపతులబెదరించుట? స్వాములవారికొఱకు వ్యయముచేసెడి యీధనము వెచ్చించి పాఠశాలలస్థాపింపవలెనఁట. పుస్తకభాండాగారముల నెలకొల్పవలెనఁట. ఆహా! యేమి యీనీతివైశద్యము. ఎన్నియేనిసత్కార్యములు చేయవచ్చును వలదనినదెవరు, అంతియేకాని యీవులఁజంపి పాదరక్షలు దానముచేసినట్లు స్వాములవారికీయవలసిన ద్రవ్యము పెట్టి పాఠశాలాదిస్థాపనచేయుఁడని బోధించుట యెంతయో నింద్యమైనసంగతి పాప మీ నవనాగరికుఁడు పాఠశాలలకును భాండాగారములకును సరస్వతి నాహ్వానించి జ్ఞానముసంపాదించుకొని తోడిమానవులతో సమానస్వాతంత్ర్యమునొందఁ జూచుచున్నవాఁడుకాని యీయుద్యమమున కంతటికిని బ్రకృతమాఁవడిన యతినిందాపరాయణత్వము వేరుపురుగువంటిది ఇది కేవలయతినిందయేకాదు, గురునింద. అంతియేకాదు. ఆచార్యనింద. ఇంత దౌర్భాగ్యమునకుఁ దానుదిగుటయేకాక తాఁజెడ్డకోఁతి వనమెల్లఁజెఱచెనన్నటులఁ దోడిమానవులకును బోధింపఁగడంగినాఁడు, కావున నీప్రలాపములు చెవినిబెట్టి గురుధిక్కారమునకులోనుగాక యథాపూర్వము జగద్గురువులగు శ్రీస్వాములవారని సేవించి జను లైహికాముష్మికముల నార్జించుకొందురుగాక.



*ఆ॥ కర్మఠుల్ధరిత్రి గ్రామపౌరోహిత్య, మాచరింపరంట యారవినుఁడు
ఇంత పెద్దయింటియీతనిజాతివా! రెట్టులాచరింతు రట్టిచేష్ట

♦శా॥ అందుం గొందఱు చేతురంట, యెవరో యాచేయువాచార్యు, లే
పందల్ వీరిఁ బురోహితత్వమునకై ప్రార్థించిరో, యందుకే
ముందీతండు ప్రమాణముల్ సలుప కేమో మాలిగెన్, సల్పి యా
చందం బన్నియుఁ గల్లలాడుటకునై శంకించినాఁడే మొకో

పృథ్వి॥ ప్రమాణమొనరించుచుం బలుకుకల్లకే పాపమై
ప్రమాణమొనరింప కప్రతిహతంబుగా నూఱస
త్యముల్ వలుక లేదొకో, యహహా! యెంతయాలోచనం
బు మానఘునిదౌ మదింబొడమె, మెచ్చఁగావచ్చుఁబో

చ॥ మునిసభ మంచివాఁడగుట మూర్ఖుఁడితండని యుత్తమాటయే
యనియెఁ "ప్రమాణముల్ సలుపనంచువచించిన నేఁడు వాసరా
లనుపఁగ నానుడై దునకు" నంచు, మఱొక్కరైనఁ దప్ప కా
పని విధియించియే యవలఁబన్పుచునుండిరి యక్కలాదునిన్

§శా॥ పౌరోహిత్యమటన్న నింద్యమనుచున్ బల్కారు నేమేమియో
మారల్ సాఁచు, సమస్తకార్యములకున్ ముందుంపఁగంబడ్డవాఁ
డే రూఢంబుగ నాఁ బురోహితుఁ, డతండే పూజ్యుఁడాదిన్, గురు
త్వారూఢుండగు వానికృత్య మెటులౌ నాక్షేపణీయం బహా!

---

*బ్రాహ్మణులమైన మేము సామాన్యముగా గ్రామపౌరోహిత్యము చేయము.

♦అచ్చటచ్చట నీ గ్రామపౌరోహిత్యముచేయువారుకూడఁగలరు.

---

ఉదియాయ ప్రాదుర్బభూవ తతఏవకుంభాత్ వసిష్ఠముషిబుషిం జాతమాహుః హేతిపూరణః.

§ గురుబాలప్రబోధిక 201 వ॥ పుట.

వ్యా॥ శాంతికపౌష్టికాదికర్మసు పురోధీయతఇతి। పురోధాః॥ క్లీస॥పు॥ పురోహితశ్చఁడు ధాఇన్ ధారణపోషణయోః, శాంతికపౌష్టికాదిక్రియలయందు ముందరనుంచఁబడువాఁడు.

*క॥ పరఁగ గ్రామపురోధకు। సిరఁటతాంబూలమొంది, నేమొఱుఁగుననీ
కారుఁడు, పెండ్లిసదస్యపుఁ। బ్రారంభమె యతనికిడిన పైనగుచుండున్

♦ఆ॥ అతఁడుదాహరించునైదుగుర్బ్రహ్మర్షు। లన్యసతుల బెండ్లియాడలేదఁ
టెప్పుడయ్యెఁ బెండ్లి యీ ఋషీశ్వరులకు। నీకథావిధానమెందుఁగలదు

చ॥ ఇటికలఁ జేర్చునట్టికద యీ ఋషిపంచకపుం బ్రశంసవ
చ్చుట, యటఁగాక వేఱొకటఁ జూపెనె యాతఁడు వారిపేళ్ళ, నే
మిటికిటు వ్యర్థజల్పనము, మెచ్చెడువారెవరిట్లు చెప్పఁ, §దే
లుటెటులు వీరుతప్ప నితరుల్ తొలి బ్రహ్మకుఁ బుట్టరన్నటుల్

క॥ కడు వెతకిచూచినను నగు
పడదీ ఋషిపంచకంబు పరుల కిఁకొకటన్
అడుగడుగున వచ్చి కనం
బడుచుండును వీరి కేమి ప్రతిబంధమొకో

†క॥ ఇఁక గార్గేయాగమమని। కుకవిత్వప్రాభవమునఁ గొమరారెడి వే
ఱొకతాటాకులపొత్తము। పెకలించిరి యెందొకాని పెద్దరికముకై

---

*సభలలోఁ దాంబూలమిచ్చునప్పుడు గ్రామపురోహితులకు ముందుగానిచ్చుట లేదు. వారియెడలఁగనఁబఱచు నగౌరవ మిదియొక్కటిమాత్రమే.

♦నే నిదివఱకుదాహరించిన యైదుగురు బ్రహ్మర్షులు బ్రాహ్మణకన్యకలఁదప్ప నితరులఁ బెండ్లాడినట్లు కనఁబడదు.

§పైని జెప్పఁబడినవారుతప్ప మఱియేఋషులును నాదిబ్రహ్మనుండి పుట్టలేదని తేలుచున్నది.

† గార్గేయాగమము 2వ పుటలో నాగమములు శిల్పులచేత నేయాచరింపఁబడవలెనని చెప్పబడియున్నది. ఆపుస్తకము ముఖ్యముగాఁ బ్రతిష్ఠలవిషయములో సంబంధించియున్నది. 7వ పుటలో నావాహనమంత్రములు శిల్పులచేతనే యధ్యయనముచేయఁబడవలెనని చెప్పబడియున్నది. కోర్టువారి రిమార్కు (ఈగ్రంధము తాటియాకులది. ఇదియు నాక్షేపింపఁబడినది. ఇది నిజమైనదేయని రుజావుచేయుహరతుమీఁద దాఖల్ చేసికోఁబడినది.)

---

† గార్గేయాగమము.

......యావత్కర్మకృతం వ శిల్పికర్తవ్య మాచరేతు బ్రాహ్మణో వా శివా

క॥ తప్పులుకుప్పలుకుప్పలు। యొప్పెచ్చట నేని యొకటియుండునో లేదో
అప్పాత్తముగొప్పతనం। బిప్పాటిదె, యదియు బుధుల కేర్పడుఁజదువన్

క॥ శిల్పి ప్రతిష్ఠాకృత్యము। సల్పుటకర్హుండటంచుఁ జాటెడిఁగాని
కల్పింపదువిప్రతయ। య్యల్పకులంబునకు, దీనినరయుఁడు ప్రాజ్ఞుల్

తే॥ సల్పుదురు కానవిగ్రహాల్ క్షమను దామె
తత్ప్రతిష్ఠాధికారముం దమకె కలద
టన్న యొక్క దురూహమై నటుల వ్రాసి
కొనిన వారలు తద్గ్రంథమునను వారు

క॥ ఇది వ్రాసికొనెడి నాఁటికి
మది బ్రాహ్మ్యముమీఁదిబుద్ధి మరలద యీ దు
ర్మదులకు, మరలినచో నా
కొదవయునుం బూర్తిచేసికొనియే యుందుర్

ఆ॥ విగ్రహ ప్రతిష్ఠ వివరింప శిల్పిదే
కాని బ్రాహ్మణునిది కాదటంచు
శిల్పి బ్రాహ్మణుండు క్షితి నొక్కరుఁడుగాని
తేల్చియుండె నేతదీయకృతియె

*తే॥ శిల్పి యితఁడొక్కఁడే కాదు క్షితిని జూడ
సాలె చాకలి మంగలి చర్మకార
జనులుగూడను శిల్పులే, కనుక వారు
నాచరింపంగఁదగునుబో యా ప్రతిష్ఠ

---

ర్చస్య అన్యైశ్చైవకృతాయది। అనేక పాపసంప్రాప్తం బింబస్యారిష్టకం తథా। పూర్వాచార్యాదిభిశ్చైవ శిల్పియా కురుతాంతథా। వినాశిల్పించియత్కార్యం నకుర్యా బ్రాహ్మణాదిభిః।......ప్రథమంశిల్పినాచైవ ఆశీర్వాదం విధీయతాం। అనంతరంచవిప్రాణాం ఆశీర్వాదంతథైవచ।...

*గురుబాలప్రబోధిక 254వ పుట

శ్లో॥ తక్షాచ. తంతువాయశ్చ నాపితో రజకస్తథా। పంచమ శ్చర్మకారశ్చ కారవ శ్శిల్పి నామతా॥

ఆ॥ శిల్పులగుదుమన్న జిక్కుదు బ్రాహ్మణ్యంబు చిక్కనేని ప్రతిష్ఠ చెదరిపోవు
వీరు తెచ్చుకొనినవింతగార్దెయాగ। మం బెగొంతుకురిగమాఱుదకు

కం॥ సకలస్మృతిరత్నంబులఁ। బ్రకటితమయ్యెం బ్రతిష్ఠ బ్రాహ్మణుకృతిగా
ఇఁక మనగార్దెయాగము। మొకడే శిల్పికివిధించుచున్నది బానిన్

కం॥ అవనిస్థలిఁ బ్రథితములై। శివవిష్ణ్వాగమములెన్నొ చెల్వారఁగ ని
ప్పైవనికినంగీకార్యం। బవు నీగార్దెయ ఘక్కయుఁ బ్రశుతమగుటన్

*చ॥ రథమును జేయు నెల్లగును రమ్యముగన్ రథకారనాములై
పృథివిఁ జెలంగవచ్చునని ప్రీతివచించియుమున్ క్రమ్మరన్
ప్రథమపుమూఁడువర్ణములఁ బర్వెడివారల కేరికేనియున్
రథమును జేయఁ దత్పదము రాజిలునన్న ద్వివర్తిగాదొకో

కం॥ ఇట్టి ద్వివర్తిదురుక్తులె
పుట్టెడుగల వితనిసాత్త్వమునఁ గాని కనన్
గట్టి దొకమాటయేన్ గను
పట్టదు, శోధింపుఁడింక బాగుగ మీరల్

తే॥ "పృథివి రథకారులందురు రథముఁ జేయు
జనములను గాని యది యొక్క జాతికా" ద
టంచుమును చెప్పి యామీఁద ననియెమరల
"ఉండె రథకారులనుజాతి యొకటి,, యనుచు॥

•క॥ రథకారజాతియొక్కటి। పృథివింగలనదంటగాని పేరునకుం ద
ద్రథకారజాతివారికి। రథకృతిసంబంధ మొక్కరవ లేదఁటచూ

---

క్రాసు.

మాకుఁ బ్రమాణగ్రంథములు శ్రుతులు స్మృతులు పురాణములు *రథమును జేయు వారందఱు రథకారులని పిలుఁబడవచ్చును. అది యొకజాతికాదు. ఆపేరు వృత్తిని మాత్రమే తెలియఁజేయును. వృత్తివలన రథమును జేయువాని కెవనికైనను మొదటి మూడువర్గములలో రథకారశబ్ద మన్వయించును.

•రథకారులను జాతి యొకటి కలదు. కాని వారికి రథముఁ జేయువృత్తితో సంబంధము లేదు.

*ఉ॥ సంకరజాతికానియది స్వచ్ఛముకాదఁట, యద్దియిప్పు డీ
వంకలఁ బ్రాణముల్గలిగి వర్తిలుచున్నదో లేదో స్వాత్మకుఁ
శంకయొయుంట, యీయధమజాతి కుదీరితమైనవృత్తి యే
పోంకపుదో యెఱుంగఁడఁట, బొంకిననీవిధినుండనాఁగదా

♦క॥ కంచరి కమ్మరి కాసెయ।టంచుం గమసాలియనుచు నాత్మీయులు
ల్పించుకొనుచుందురఁట, యవియెంచంగఁ వృత్తిఁబట్టి యేర్పడెనఁట।

ఆ॥ మ్లేచ్ఛముఖ్యజనులు మెలఁగుచునున్నవార్
వీరివృత్తులందు వేడ్కనిపుడు
కాని వారినెవరు కమసాలులనుపేళ్ల
వాడుచుంట గనము వసుధలోన

ఉ॥ చెప్పుల జేరగాండ్రెవరో చెప్పుడియిప్పుడు పట్టణంబుల
న్గొప్పకులంబువార్కద, జనుల్ మఱివారిని జర్మకారులం
చిప్పుడువాడుచుండిరో కో, యొట్టిక వృత్తినిబట్టి యిట్టి పే
ళ్లుప్పతిలుఁ ధరిత్రిపయి నొక్కకులానకుమాత్ర మారయన్॥

§క॥ పంచాణపుఁగులమేయిల నెంచంగన్ లేదటంచు నితఁడువచించెన్
ప్రాంచులు కొందఱు తార్వచి।యించిరి వీరి దెయటంచు నెఱుఁగం గతము।

---

*ఆజాతి సంకరమైనదికానియసత్తైనదికాదు. ఆరథకారవర్గ మిప్పుడు జీవిం చియున్నదో లేదో నాకుఁదెలియదు. రథకారజాతికి విధింపఁబడిన వృత్తి యేదియో నుజెప్పలేను. మాబ్రాహ్మణజాతిలోఁ దక్షకులనువారు లేరు. ఎవరేపనిచేయుదురో వారి నట్లుపిలుతురు.

♦మాలోనైనను బంగారపుఁ బనిచేయువారిని గమసాలులనిపిలుతురు. ఆ పే ర్వృత్తివలన నుత్పన్నమైనది.

§పంచాణయనిపిలువఁబడుకులము లేదు.

---

§శబ్దరత్నాకరము 628 వ పుట

పంచాణంబువాఁడు-ద్వ-వి-శిల్పి

బ్రౌన్యనిఘంటువు,

పంచాణము-Workmen, mechanics or handcraftsmen Th united five castes of the carpenter, blacksmith, brazie goldsmith and stone-cutter పంచాణమువాండ్లు people of thes **castes.**

*తే॥ ప్రజల కుపయోగకరములౌ పనుల నెల్ల
సలుపుచుండ్రిట యీతనిజాతివారు
అకట ! యీనుడి కడు పరిహాసపాత్ర
మగుట గానఁడు నిజఘనతాతురతను॥ 185

సీ॥ కలధౌతమయములౌ కమనీయభూషల
హెచ్చుకూలికిఁ జేసియిచ్చుటయును
విషమదారుగణంబు వివిధరీతులఁ జెక్కి
ఘనరథగృహములం గట్టుటయును
కృష్యాదికంబైన క్రియకు సాధనములౌ
హలకులిశాదులఁ సలుపుటయును
త్రప్వయస్తపనీయరాజతపాత్రముల్
మదికినింపగులా గమరుచుటయును
కఠినశిలలెల్ల బ్రద్దలుగా నొనర్చి
దేవతావిగ్రహంబులం దీర్చుటయును
ఆదిగాఁగల కొన్ని కార్యములె వీరి
వలన నగుఁగాని కానివి కల వెఁకెన్నొ॥ 186

సీ॥ చీనిచీనాంబరాల్ చిత్రచిత్రముగ నే
యుట యొక లోకోపయోగికృతియె
మురికివౌ వసనముల్ కరము తెల్లగఁ జేసి
యొసఁగుట లోకోపయోగికృతియె
శోభరా మొగమున క్షురకర్మ మొనరించి
యేగుట లోకోపయోగికృతియె
బహువిధంబులుగాఁగఁ బాదరక్షలమర్చి
యుంచుట లోకోపయోగికృతియె

---

*మాకులమువారు మనుష్యుల కుపయోగకరములైనవృత్తులన్నిటి నవలంబింతురు.

పతి దాదికంబు లెన్నియో కలవింక
క్షితిఁ బ్రజోపయోగికృతులు దలఁప
అన్నియెల్లఁ దామె యాచరించినఁగదా
తావచించుమాట తథ్యమగుట॥ 187

*క॥ తా బ్రాహ్మణుఁడై రథములనొబ్బంబుగఁ జేయు వానికర్థము చెప్పెన్
స్త్రబగరథకారోనామబ్రాహ్మణయనెడిచోటమది కెక్కుమిచేన్॥

•క॥ ఒకబ్రాహ్మణుఁ డావృత్తిని
బ్రికటంబుగఁబూనినటులఁ బలుకుటకై పూ
ర్వికు లది వాడినవారఁట
ఇఁకఁ గౌముది యితనియొద్దనే చదువవలెన్॥ 189

§క॥ అబహిష్కృతశూద్రుండై। ప్రబలునయస్కారుఁడితఁడు పాణినిమతరీ
తిఁబడాయిఁకొట్టుచేమో। కబురులు చెప్పంగఁబూనెఁగానకదానిన్॥

@క॥ విశ్వబ్రహ్మోపనిష। ద్విశ్వరుఁడుంజూపఁజాలఁడిలఁగూఢముగన్
విశ్వబ్రహ్మపదంబే। విశ్వంబున లేకయుండ వెలయునదెటులన్ 191

*6వ ర్కుదస్తావేజు (సిద్ధాంతకౌముది)లో "రథకారోనామ బ్రాహ్మణః" యనునది వర్ణమువలన బ్రాహ్మణుఁడై వృత్తివలన రథకారుఁడైనవానికి సంబంధించినది

•ఒకబ్రాహ్మణుఁ డావృత్తి నవలంబించినట్లు తెలియఁజేయుటకై యది వాడఁబడినది.

@మాపత్రిపరఖండవిశ్వబ్రహ్మోపనిషత్తునందువివరింపఁబడియున్నదిమాప్రవరఖండకొఱకు నేను బురాణములలోఁ జూడలేదు. వైదికులగోత్రములను నేను సాంగముగాఁ జెప్పజాలను. వారు వసిష్ఠునియొక్కయు రాజఋషులయొక్కయు సంతతివారు. భరద్వాజకౌండిన్యప్రముఖగోత్రములవారు వైదికులు- పుస్తకావేతులేక భరద్వాజ గోత్రి ఋషుల మూలముఁ జెప్పలేను.

§సిద్ధాన్తకౌముదీ

"శూద్రాణామనిరవసితానామ్" ౨-౪-౧౦। అబహిష్కృతానాం, శూద్రాణాం ప్రాగ్వత్। "తక్షాయస్కారమ్" పాత్రాద్బహిష్కృతానాం, "చండాలమృతపాః"॥

తత్వబోధినీ,

- శూద్రాణామ్*త్రైవర్ణికేతరమనుష్యపర శ్శూద్రశబ్దో, నతుశూద్రత్వజాతిపరః। అనిరవసితానామితినిషేధాత్ * పాత్రాదితి*మైర్భుక్తే "భస్మనాశుధ్యతేకాంస్యమ్"

ఆ॥ ఉపనిషత్తు లెన్నొ యుండియుంట నిజంబె
కాని యిద్దియుంట కల్లమాట
వ్రాసికొనినవారు వారె విశ్వబ్రహ్మ
యుపనిష త్తటంచుఁ గపటమతిని॥ 192

ఆ॥ ఉపనిషత్తులనఁగ నుర్వి వేదాంతముల్
వానిలోన నాత్మవస్తుత త్త్వ
ముండుఁగాని ప్రవరఖండ మెటుండెడి
స్వర్ణ ముపహరించుజాతిఁగూర్చి 193

ఆ॥ కుంభినీసురులకు గోత్రప్రవరనిర్ణ
యంబుచేసియుంచి రాదిమునులు
వర్తిలంగవలయు బ్రాహ్మణులైనచో
వీరి ప్రవరగోత్రవివర మందు 194

కం॥ విశ్వబ్రహ్మపదంబే। పశ్వాలపనంబు మూఢ్కి వ్యర్థము గాఁగ౯
విశ్వబ్రహ్మోపనిష। త్తే శ్వేతను భవుండు చేసెనిజాతికిఁగా౯ 195

ఆ॥ బ్రాహ్మణత్వమనెడి బ్రహ్మగ్రహముపట్టి యేడిపించుచుంట నిట్లువీరె
పోగుచేసినారుపూని విశ్వబ్రహ్మయుపనిష త్తటంచు త్తచెత్త 196

తే॥ అచ్చువేయించి క్రొత్తగా నపుడె దాని
కోర్టునకుఁదెచ్చె నా కట్టెగొట్టుజనము
ప్రస్పుపేరైనఁ బ్రచురింపఁబడమి దాన
కడకుఁద్రోసెను ధర్మాధికారి కినుక 197

*కం॥ లేక యె బ్రహ్మజ్ఞానం। బేకరణినొ బ్రాహ్మణుఁడగునీతని యున్నం
బేకుల ము వారుగూడను। వాంకొని భుజియింపరంటయు క్రుతమే మా

---

ఇత్యాదిస్మృత్యుక్తసంస్కారేణాపి। పాత్రనంశుద్ధ్యతి తేషామిత్యర్థః॥

---

*విశ్వబ్రాహ్మణులనివాడఁబడు బ్రాహ్మణులే నిజమైన బ్రాహ్మలు- బ్రహ్మజ్ఞానము కలిగిన బ్రాహ్మణులితరు లుండవచ్చును. మా బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానములేకయు బ్రాహ్మణులని పిలువబడుదురు, ఏలయన, బ్రహ్మజ్ఞానము మా సహపంక్తికిఁగాని సహోద్వాహమునకుఁగాని సమ్బంధింపదు

టీరముగా తనూసురభి కీవిఁదనర్చెడికొప్పు బంభరీ
వారముగా లతాంగిపరివారముగా పురుషాళి గన్గొనన్ 17

క॥ కాళము చనుగవ యుత్తము। రాళము యూనంబు రోమరాజి విసీల
వ్యాళము బాహుయుగంబు న్మృణాళము హా సిద్ధమన్న నారీమణికిన్

చ॥ అరుణమణిప్రవాళసురపాశ్మ సుమాణిక్య వజ్రరత్నముల్
బరువడిఁగూర్చి చిత్రముగఁ బాదరదాంశుక కేశదంతసుం
దరనఖముల్ రచించి తగఁ దత్క్రియఁ జేయఁడు గా విరించి యీ
సరసిజనేత్రి చిత్తము విచారమొనర్చి మదిం దలంచినన్ 17

సీ॥ కమ్మపూఁదేనియ కాల్వలై పాఱదే
కల్కి తియ్యనిపల్కు పల్కెనేని
చెలువారు పండు వెన్నెల తేట నిండదే
జవ్వని లేనవ్వు నవ్వెనేని
వెలిదమ్మివిరివాన వెలయక కురియదే
సుందరి కన్నెత్తి చూచెనేని
డాలైన నును కెంపురాలు రాసులుగావె
పడఁతి రెండడుగులు నడచెనేని
చారుతరసార ఘనసారసౌరభంబు
పొలయదే కొమ్మ యూరుపుచ్చెనేని
వితతముగ దీని నతులితగతులరతులఁ
గలయఁగలుగుట బహుజన్మఫలము గాదె 17

ఉ॥ ఈరమణీలలాము నను నెంతయుఁ గూరిమి పిక్కటిల్లఁగాఁ
దోరపుగబ్బిగుబ్బచనుదోయి యెదం గదియంగఁ గౌఁగిటన్
జేరిచి తేటతేనియలు చిప్పిలఁ దీయని మోవివిందు పెం
పారఁగఁ జేసి నవ్యమధురాంచిత భాషలగారవించి వి
స్ఫారమనోజకేళికిని బాల్పడఁ జేసిన సౌఖ్యమెట్టిదో,, 17

కం॥ అని యువ్విళ్ళూరెడి నృప

తినిగనుగొని హితుఁడుపల్కె, "దేవర! యోఁజె
ప్పినవార్త నిజముగాదే
నను నచటికి నింకఁ బంపు నయ ముప్పొంగన్ 177
కం॥ కామినినతుల్కలనామము । తే మునివాసస్థలంబ దెచ్చటనో తా
నేమినిమిత్తంబివ్వన । భూమిన్ వసియించినదియొ పోలఁతులుగొల్వన్
వ॥ అత్యంత నిగూఢక్రీడాప్రవర్తితోదారలగు రాజన్యశుద్ధాంత కాంతాజనంబులకడకు మిముబోటిమహానుభావు లప్రియత్నంబునం జనుదెంచుట గౌరవశ్రీప్రాతికూల్యంబుగావున వారలవృత్తాంతం బెఱింగి వచ్చెద, 178
చం॥ అనవుడు భూమిపాలకశశాంకుఁడు మిత్రునితోడఁ బల్కె "మ
జ్జనకుఁడు తొల్లి నీ తుహినశైలసమీపవనాంతరంబునన్
వనజముఖీసహస్రము లవారణవైభవలీలఁ గొల్వఁగా
వనధరనీలవేణి వరవర్ణిని యోతున్ వసించి ప్రేమచేన్ 179
వ॥ భవత్సంబంధంబునకై యపారమోహాతిరేకంబున దినంబులుగడపుచున్నది, మృగవ్యానవ్యఖేలనవ్యాసంగంబునం జని వసంత దినాంతరంబుల నవ్వరారోహాంగని వివాహంబుగమ్మనిపల్కెఁ గావున నిక్కరంగనయనమదీయజనకుం డెఱింగించినకన్యకామణియగుటఁ బోలు నీహిమవన్మహీధరప్రాంతోద్యానాంతరంబునఁ గాంతాజనసమేతయై వసంతదినంబుల మత్సమాగమంబున కెదురుచూచుచున్నదిగావలయు, నీవు చనితద్వృత్తాంతం బెఱింగిర"మ్మనిపనిచిన, 180
క॥ నగుమొగముతోడ నెచ్చెలి
ముగుదలువసియించు కుంజమున కేగి యటన్
నిగనిగనికలువరారా
జగతిపయిం గూరుచున్న జవ్వనిఁ గాంచెన్ 181
వ॥ కాంచి కించిన్మధ్యలు చంచత్కౌతూహలాద్భుతరసాక్రాం(తలగుచునాద)రింప నచ్చట నాసీనుండై యత్యంతగంభీరమృదుమధుర

చతురవచనరచనల నయ్యుచిరరుచిరుచికిట్లనియె, 182

ఉ॥ "నీలావణ్యకళావిలాసములు వర్ణింపంగరాదేరి కో
బాలా! యెవ్వరిదానవీవు, దివిషత్పద్మాస్యవో భోగభృ
న్నాళీకేక్షణవో ఖగాంగనవొ గన్ధర్వాబ్జరాగోష్ఠవో
యేలా యివ్వనభూములందిరుగఁ జేరే మేర్పడంజెప్పుమా 183

మ॥ తెలియం జెప్పెద సావధానముగ మద్వృత్తాంతమాలింపు మో
జలజాతాక్షి సముద్రముద్రిత ధరాచక్రావనోద్యద్విలా
సలసద్రాజశిరఃకిరీటఘటితాంచద్రత్నచిత్రప్రభా
కలితోదారపదుండు శంతనుమహీకాంతుం డెసంగున్ భువిన్ 184

చం॥ జనకుఁ డహో ప్రదీపుఁడఁట, చారుకళానిధి సారసారి త
ద్ఘనతరవంశకర్తయఁట, కంధిచతుష్టయవేష్టితాఖిలా
వనితలపాలనోజ్జ్వల నృపల్లభరత్నచయంబు సత్సహా
జ్జనఁమట, భోగభాగ్యముల శంతనుఁబోలుదురెవ్వరంగనా! 185

తే॥ అమ్మహారాజు నన్ను నత్యాదరమున
తనదు మంత్రులలోపల ఘనతఁ బ్రోచు
అతనితోడుత సఖ్యసౌఖ్యానుభూతి
నిచ్ఛయించిన నొందింతు నేరికైన 186

క॥ పేరు విశారదుఁడందురు। సారసదళనేత్రి! రాజచంద్రుఁడు మృగయో
దారమతివనికి రాఁగా। వారక నేనతని వెంటవచ్చితిఁ బేర్మిన్ "॥ 187

వ॥ అని తెల్పిన, 188

తే॥ మానసముజల్లుమనియె, నెమ్మనఁబులక
పాళి మొనచూపెఁ, గోర్కులు ప్రబలమయ్యె
గాఢకౌతూహలానురాగమ్ము లొదవె
శంతనునివార్త చెవిసోఁకినంత సతికి 189

• మంత్రితోడఁ జెలికత్తె గంగవృత్తాంతము దెలుపుట •

తే॥ అట్లు బద్ధానురాగయై యంబుజాక్షి

హాసమందాక్షయుత వీక్షణాంచలమునఁ
దనసఖీమణిఁజూచిఁ దద్భావమెఱిఁగి
సరసలీలల నాప్రౌఢసకియ పలికె 190

సీ॥ శ్రీరమాపతియైన నారాయణస్వామి
పదపద్మసీమ సంభవముగాంచె
సకలమంగళదివ్యసౌభాగ్యముల మీఱి
త్రైలోక్యములయందుఁ దగ వసించె
యమునాసరస్వతీప్రముఖతరంగిణీ
తతులలోపలఁ బెద్దతనముగాంచె
వర్ణనీయ ప్రాణివర్గపావనభవ్య
సరసకళా మహోజ్జ్వలత గాంచె
గంగయనుపేరఁబరఁగునీ కమలవదన
పరఁగ నేమెల్ల నిక్కన్న ప్రాణసఖుల
మొకమహాకారణముగలిగియుండవలసె
సింధువునకిట్టు లివ్వసనీయుయందు 191

చ॥ కువలయపాలమిత్రి! విను గోప్యము సేయఁగనేల సజ్జనో
త్సవవిలసచ్చరిత్రుఁడగు శంతనురాణ్మణి సద్గుణప్రభా
నివహము తద్గురుండు నయనిర్మలభాషలఁదెల్ప నీగతిఁ
శ్రవణరసాయనంబుగ ససంభ్రమతఁ విని మోహితాత్మనై 192

సీ॥ అశ్రాంతసరసకాశాగతాంభశ్చర
ధ్వజకాండవర్షసంతతులఁ దడిసి
అకలంకసాంద్రచంద్రాతపద్యోతమా
నాతపానర్గళవ్యాప్తినొంది
గంధగోత్రాధరాగమ సుశీతలగంధ
వాహాంబుచల్లు బల్వడలఁ గంది
విస్ఫూర్జితాక్షుద్రవిరహసంభూత సు
స్థిరపరితాపంబుచేఁ గృశించి

తపము సేయుచున్నది నృపతిఁ గూర్చి
శంతనుని రాక దెల్పితి సరవి వీరి
కిరువురకుఁ గూర్ప నీకన్న నెవ్వరింక
మంజువాగ్దేవతాచార్య! మంత్రివర్య!" 193

క॥ నాపుడు మంత్రిసుతుండను "దైవాజ్ఞను రాజమణికిఁ దరుణీమణికిన్
భావింపఁగ ననుకూల। శ్రీవిభవముఁ గల్గు వేదసిద్ధాంతముగన్ 194

వ॥ కావున, 195

క॥ శంతనుభూకాంతునకున్ గాంతామణివార్త దెలిపి కౌతూహలసం
క్రాంతాత్మునిఁ గాఁ జేసిట కెంతయుఁ దూర్ణమునఁ దెత్తు నీక్షింపుఁడో గిన్

వ॥ పోయివచ్చెద" ననపలికి వారిచేత ననుజ్ఞవడసి శంతనుభూ
కాంతుకడకుం జని కాంతావృత్తాంతంబంతయు విన్నవించిన, 197

తే॥ పులకితతి మేనఁ బొడమెఁ, గపోలయుగళి
చికిలి యొనరిచె. లేనవ్వు సిరి వహించె
వదన, మనురాగసంపూర్తిఁ బొదలె హృదయ
మతివవృత్తాంత మాలించినంతెఁ బతికి 198

వ॥ ఇట్లద్భుతానురాగజలధినిర్మగ్నమానసుండైన మానవేం
ద్రునిం గనుంగొని, 199

క॥ మానరిసవాసభృంగి
గానధ్వానము లనూనగతులఁ దనరఁ జెం
పూనిన పాదరంటికిఁ జన
మానినిపీడనము చేసె మానవతిలకున్ 200

సీ॥ అకలంకలావణ్య సుకుమారలలితాంగ
లతికకు మిగులఁ జల్లదనమబ్బె
భువనైకమోహనాద్భుతవిలోలేక్షణ
కైరవంబులకు వైకాస్య మొదవె
స్వచ్ఛతరాఖండసాంద్రీభవత్కౌతు
కోల్లోలజలరాశి నెల్లివిరిసె

సతతప్రతీక్షణజాయమానప్రచిం
తాసమవాయాంధతమము దొలఁగ
గీ॥ సురుచిరాంతఃపరిపూర్ణ వియోగజనిత
తతపరిశ్రమభూరిసంతాపమణఁగ
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రరాజ
చంద్రసందర్శనంబునఁ జారుముఖికి॥ 201

క॥ తరుణీమణిచూపు మహీ
శ్వరుచూపనోర్వ్యన్య ధైర్యసంపద లహహా!
హరియించెఁ జికిలియొసరిబి
సరసీజాంబకుఁడుపఱుపు సరిగోలలకున్॥ 202

వ॥ అయ్యెడ, 203

చ॥ కలికిమిటారి వాల్కలుకుకన్నులఁ గమ్మెడుసిగ్గుపెంపునన్
లలన మొగంబు వాంచి పదలగ్నమణీకటకోదయర్ఝుళం
ఝుళమధురాయతార్భటుల సంచల దంచితమధ్యకీలితో
జ్జ్వలరశనోరుకంకణభవ స్ఫుటరావము లైక్యమై తగన్॥ 204

తే॥ లేచి కుచకుంభభరమున లేఁతకౌను
వడఁక శశికాంతవేది నింపడరఁ గదలి
సఖులతోడ నికుంజము చాటుకరిగె
మేఘతతిమాటుకరిగెడి మెఱుపనంగ 205

సీ॥ నీలంపురాకప్పు మీఱు మేలనొప్పు
విప్పైన గొప్ప కీల్కొప్పుచొప్పు
కౌదమసింగము తీరు నదలింపఁగాఁగోరు
కలికి లేఁత మెఱుంగు కౌను సొగు
ఇసుకతిప్పలఁ గ్రిందువేసిచేసి రహించు
సుందరంబైన పిఱుందు పొందు
పసిడియంచులఁ జిక్కపఱుపఁగాఁ దగ నిక్కు
డంబైన మందయానంబు టెక్కు

మానినీమణిసోదరింటిమాటుకరుగ
సరసిజాక్షులతో నట మరలునప్పు
డవనిపాలేంద్రు మానసాబ్జాంత గాళ
మతులమోహాతిశయమున నలరఁ జేసె॥ 206

వ॥ ఇట్లు నికుంజంబుమాటున నిల్చి తదీయరంధ్రంబుల రాజ
కుమారమన్మథుం గనుంగొని యొక్క ప్రౌఢయగు నమఁగుచెలితో
నిట్లనియె, 207

క॥ "కంతునిజూడమొ రజనీ
కాంతు వసంతుని జయంతుఁ గనుగొనమో యో
కాంతామణి! యీవసుధా
కాంతునిబోలుదురె రూపగౌరవలీలన్॥ 208

చ॥ సకియరో! యీనృపోత్తముని చక్కదనంబు విలాసవైభవం
బకుటిలలీలఁగన్న లలితాంగుల నిబ్బరపుబ్బుగబ్బిగు
బ్బకవలమధ్యరంగములు బంగరుగేదఁగిపువ్వుఱేకు మేల్
చికిలికటారిచేగుదిఁ గచిక్కనగ్రుమ్మఁగ మారుఁ డుగ్రుఁడై॥ 209

తే॥ ఇతనిఁ గౌఁగిటఁ జేర్చి పెంపెసఁగఁ గ్రోవి
విందుగాఁగొని రతికేళి నొందనట్టి
వనిత తారుణ్యలావణ్యవైభవములు
అడవిఁగాసిన వెన్నెల తోటగాదె 210

సీ॥ పికవాణులకుఁ జాలఁ బ్రియముపుట్టింపదే
యతివ! యీతని పల్లవాధరంబు
కువలయాక్షుల కెదఁ గోర్కెనొందింపదే
సుందరి! యితని పూర్ణేందువదన
మబ్జాతముఖులకు నాసగల్పింపదే
తెఱవ! యీతని సూర్యదీప్తిమహిమ
సారంగకచల నోరూరంగఁ జేయదే
వనిత! యీతని మధువాక్యరచన

సుదతి! యీతనిచైత్రభాసురవిలాస
మెట్టిలతికానలకునైన నెలమిపుట్టఁ
జేయదే" యని యాశ్చర్యసింధుమగ్న
మానసాంబుజయై పల్కె మఱియు సఖికి 211

మ॥ చిరకాలంబుననుండి యీతని మదిం జింతించి చింతించి స
ద్విరహప్రాకట వేదనాభరమునన్ క్రాఁగఁగ నిన్నాళ్ళకే
ధరణీనాథకులావతంసు నిటకున్ సల్లీలఁ దోడ్తెచ్చె నీ
శ్వరుఁ డత్యంతదృఢానురాగముగ మత్సంకల్ప మీడేర్పఁగన్ 212

వ॥ అనివర్ణించుచుండ నప్పుడు, 213

### శంతనుమహారాజునకు నారాయణమూర్తి ప్రత్యక్షమగుట

సీ॥ కమలాద్యలంకారకలితంబులై భుజాం
తరనేత్రములు మనోహరత మెఱయ
ఘనసువర్ణాంచత్ప్రకాశమానంబులై
నేత్రగాత్రములు పన్నియుఁ జెలంగ
ప్రస్ఫురద్ద్విజరాజరాజమానంబులై
ధ్వజవదనంబులు తనరుచుండ
మంజులతరానంతమణిసుందరంబులై
కోటీరదీప్తులు కొమరుమిగుల

గీ॥ అపుడు ప్రత్యక్షమయ్యె నారాయణుండు
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రు నెదుట
అమలశతకోటికోటిజన్మాంతరార్జి
తాతివిస్తరసుకృతమాహాత్మ్యమునను॥ 214

తే॥ అట్లుసాక్షాత్కరించిన యాదిదేవు
భక్తవత్సలు నిందిరాప్రాణనాథుఁ
గాంచి పులకితగాత్రుఁడై కౌతుకాద్భు
తాతిశయములువొడమ సాష్టాంగమెరఁగి॥ 215

ధారుణిఁ బద్మకంబన మహావసథం బలరారు, దానికిన్
జేరువ దక్షిణంబునను సింధుతటిన్ శివభక్తసేవ్యమై

తే॥ కలదు దివ్యమహాస్థలి, కల్పమందు
సర్వమును లయంబైనట్టి సమయమునను
నన్నుఁజేరును నచ్చోట నఖిలవేద
చయము సంస్కారరూపమై జలజనయన!

తే॥ అంతఁ గల్పాదియందున నఖిలలోక
పాలనంబున కంగముల్ పరఁగఁదాల్చి
యచటనావల్లవెడలె వేదాళి, యట్టి
ధామమొప్పె వేదారణ్యనామమునను

సీ॥ బ్రహ్మచే మును దేవసంఘంబు మునులు వే
దారణ్యమున కేగి యంబురాశి
అర్ధయోజనమాత్రమైన విస్తీర్ణంబు
నటు పాదయోజనాయతముగల్గు
వేదతీర్థంబున వెస నర్కవారంబు
నను బర్వకాలంబునను సుభక్తి
స్నానంబుచేసి వేదారణ్యనాయకు
(నర్చనసేయంగ) నాయమేశుఁ
డంబికాయుక్తుఁడై వారలందఱకిని
నతనిపాదంబొసంగె, నాస్కందుఁడచట
స్నాతుఁడగుచు వేదారణ్యనాథునన్నుఁ
గొల్చి మంత్రిసాదంబున ఘోరతార
కాసురునిజంపి లోకాళి నలరఁజేసె 74

కం॥ మునునారదుఁడచ్చోటను ।
గని వేదారణ్యనాథుఁగలుష వినోదున్
(ఘనుఁడగుననత్కుమారా
ఖ్యునను గ్రహముననుజ్ఞాన మొందెను పేర్మిదా!)

తే॥ యాజ్ఞవల్క్యుండు నచ్చోట నభవుఁగొల్చి
స్నాన మొనరించి ప్రొద్దున జలజనాభ!
మత్ప్రసాదంబుకలిమి సేమంబుదొడర
ధరణి యోగీశ్వరుండయ్యెఁ దత్క్షణంబ 76

కం॥ ఆవేదారణ్యంబున । నా వేదాభిఖ్యతీర్థమందునస్నానం
బావిధిఁ జేసితదీశ్వరు । సేవించిప్రదక్షిణంబు సేయుశుభ క్తిక్ 77

వ॥ బ్రహ్మజ్ఞానంబునొందిరి మఱియును,

సీ॥ ఇచ్చటభూదాన మిచ్చిననాతండు
రుద్రలోకావాప్తిరూఢుఁడగును
ధనధాన్యదాయి దా ధనదసమానుఁడౌ
నన్నదాని యరోగియగును, వస్త్ర
దాని యింద్రుఁడు, తిలదాని యపాపుఁడౌ
పార్వతీలోకంబుఁబడయుఁ గన్య
నొసఁగిన, విషువాయనోష్ణాంశుచంద్రమో
గ్రహణంబులను బర్వకాలములను
భానువారవ్యతీపాత మానితార్ద్రి
లందుఁ దా వేదతీర్థంబునందు స్నాన
మెలమిఁజేసి వేదారణ్యకేశునకును
తగుప్రదక్షిణములు మూఁడు తనరఁజేసి 79

వ॥ దండవన్నమస్కారంబులుచేసిన ముక్తుండగు, మఱియు నచ్చట శివయోగికి నిష్కమాత్రధనంబిచ్చి యుపవాసంబు చేసిన ముక్తుండగు, సంశయంబులేదు, సుముహూర్తంబుల నచ్చట స్నానం బొనర్చి శివుంజూచి శివయోగికరంబునఁ బణమాత్రధనంబొసంగిన ముక్తుండగు, గార్గిమైత్రేయులు పర్వంబున వేదతీర్థంబున స్నానంబుచేసి లింగరూపియగు తదీశ్వరునకుఁ బ్రదక్షిణత్రయంబొనర్చి భూమిఁ బ్రణమిల్లి తత్ప్రసాదంబున యాజ్ఞవల్క్యచేతం దెలియంబడిన జ్ఞానయోగం

బున నక్కడ ముక్తిఁ గాంచిరి, శ్వేతకేతుం డచ్చట స్నానంబు చేసి యా
వునకుఁ బరమభక్తిచేత భూమి దండవన్నమస్కారంబులు చేసిన నా
సంస్కారకారణాజ్ఞాన నాశనంబయిన యాత్మవిజ్ఞానంబు తండ్రియగు
నుద్దాలకునివలనం గాంచె, వరుణుం డవ్వేదతీర్థంబున శ్రద్ధాసహితుండై
స్నానంబు చేసి వేదారణ్యనాయకు శివు నారాధన చేసి తత్ప్రసాదంబు
నాత్మదర్శనంబు గాంచె, తత్పుత్రుండగు భృగుండును నచ్చోటనమ్మహా
దేవు నారాధించి తత్ప్రసాదంబున బ్రహ్మాత్మైక్యప్రకాశంబగు నపరో
క్షజ్ఞానంబు తండ్రియగు నవ్వరుణునివలనం గాంచె, త్రిశంకుండును నవే
దతీర్థంబున శ్రద్ధాసహితంబుగాఁ బర్వంబున స్నానంబు చేసి యమ
హేశు నారాధించి ప్రదక్షిణత్రయంబు చేసి నమస్కరించి బ్రహ్మహ
త్యాదిపాపంబులవలన ముక్తుండయ్యె నంతయు, 8

సీ॥ ఇచ్చోట మృతినొంది చెచ్చెర ముక్తుండౌ
మహి భక్తులకు మహామయహరంబు
ఇది భుక్తిముక్తులనిచ్చును, నేనును
గిరిజయు మద్భక్తవరులు దీసి
పూజింతు మీస్థానము ఘనంబు, నాచేత
సర్వవేదాంతైకసంగ్రహంబు
నగు ముక్త్యుపాయంబు తగఁ జెప్పఁగాఁబడె
నిది మహాగోప్యమౌ నిందిరేశ!
శ్రద్ధ లేకున్నఁ జెప్పెడిసరణిగాదు
తెలియుమ,,ని చక్రిశీశుండు దెలుప నమ్మ
రారి విని భక్తి మ్రొక్కె (ధూర్జటికి) నపుడు
దివ్యసంతోషవరసుధాతృప్తుఁడయ్యె 81


మోచకకథనము

వ॥ అంత నయ్యుమాకాంతుండు మాకాంతుంజూచి "యింకనీ
కు శ్రుత్యుక్తరీతి మోచకుం దెలియం జెప్పెద భక్తిశ్రద్ధాగరిష్ఠుండవై
విను" మని యిట్లనియె, 82

సీ॥ "అతినిర్మలాకృతియగు యకారాదిక్ష
కారాంతవర్ణ సంకలనచేత
కల్పితాకృతియును సఖండహారాంశుకరకాంతి
సాంద్రజటారూఢచంద్రఖండ
నీలకంధరయును ద్రినేత్ర కుండలకర్ణ
గుత్తమాలావృత దక్షహస్త
వరకమండలుయుక్త వామకరాంబుజ
జ్ఞానముద్రాఢ్య ప్రసన్న హృదయ
గీ॥ సర్వవిజ్ఞానకోశపుస్తకసమేత
సర్వలక్షణసంపన్న సర్వభూష
గాత్రి శివయఖిలవిద్యామయాంగి పుండ
రీకపీఠస్థ వాణి స్వర్లోకవినుత॥ 83
క॥ మనోన్మకనామ(గనుంగొ)ని। సన్నుతిగావించిభువిని జాగిలిపెక్కు
(మన్ననలు)చేసియీక్రియ। నన్నడిగెనుభక్తితోడనలిన దళాక్షా! 84
తే॥ ఆసరస్వతికి జగద్ధితార్థముగను
నేను గౌరీసమేతుండనై నయంబు
మీఱ మోచకు దుఃఖవిదూరమైన
పరమవిజ్ఞానమును దెల్పితి రయ(మ యది)॥ 85
తే॥ నీకు జెప్పెదనిప్పుడు నీరజాక్ష!
ధాత మొదలుగ స్థావరాంతంబులైన
జంతువులు పశువులగు, నాజంతుతతికి
అరయఁ బతినౌటఁ బశుపతియండ్రు నన్ను 86
క॥ నేనాపశువులనెల్లను బూనికతోఁగట్టివైతు. పోసఁగఁగమాయా
నానోగ్రపాశపంక్తుల వానిన్ వైకుంఠనాథ! వదలింతుఁగడున్ 87

వ॥ ఇదియు సర్వప్రమాణంబులందును బలీయసియు దోషరహితయు సాధ్వియు నగు శ్రుతిపలికె, అక్షజాదులు దోషయుక్తంబులు,

## సంస్కర్తలు రజోదర్శనానంతరస్వయంవరవివాహములు లోకానుభవయుక్తములని సాధించిరా?

కరువలికిఁ జలనగుణముండఁగా స్వయంవరవివాహములు లోకానుభవయుక్తములని మన సంఘసంస్కారసోదరులు సాధింపఁజాలరు. అదేమి? బాల్యవివాహముల నెఱుఁగని విదేశీయులు స్వయంవరవివాహములవలన మహోన్నతపదవినంది సర్వసుఖాకరులై వెలయుచుండుట మనము విని కని యున్నవారము కామా? యని యడిగెదరా? ఈప్రశ్నయందు రెండుతప్పులు గనుపడుచున్నవి. (1) విదేశములన్నిటిలో బాల్యవివాహములు లేవనుట (2) వారు స్వయంవరవివాహములవలన మహోన్నతపదవిని గనియున్నవారని చెప్పుట ఈతప్పులను నిరూపించుటకు ముందు స్వయంవరవివాహములనేమో, యవి యెన్నితెగలుగనున్నవో, యవి యెవరిచే నెట్లు గావించుకొనఁబడినవో, వానివలనఁగలిగిన లాభనష్టము లేవియో, మనము తెలిసికొనుట యత్యవసరమైయున్నది. వధువు వరుని గాని వరుఁడు వధువును గాని వరించి చేసికొనువివాహము స్వయంవరవివాహమనఁబడును

ఈస్వయంవరవివాహములు రెండువిధములుగఁ గన్పట్టుచున్నవి. అందొకటి పూర్వము మనక్షత్రియసోదరులచేఁ గావించుకొనఁబడినది. వారు తమ స్త్రీజాతియొక్క నీతి కేవిధమైనభంగము కలుగకుండ స్వయంవరవివాహములఁ గావించుకొనుచువచ్చిరి. ఆ స్వయంవరవివాహములను జేసినవారైనను దమకన్యలకు స్వాతంత్ర్యమిచ్చి నీయిష్టమువచ్చినవరు నన్వేషించి స్వయంవర వివాహముఁ జేసికొమ్మని పంపినట్లు కనుపడదు. ఇఁకేమన. కన్యాపిత ప్రపంచమునంగలరాజుల నందఱిని దనసదనమునకు రావించి యొకచో వారినందఱిని సమావేశముగావించి తనకూఁతును బిలిపించి యారాజచక్రమును జూపించి యిందు నీయిష్టమువచ్చినవరుని వరించుమనికాని మత్స్యయంత్రాదికములగు వరపరీక్షాకార్యములను నేర్పఱచి యందు జయమందినవానిని వరించుమనికాని చెప్పి యట్లువరింపఁబడినవరులకుఁ దమకూఁతులనిచ్చి పరిణయముఁ గావించుచుండెడివారు. దమయంతీ ద్రౌపదీ సీతావివాహము లిందులకు నిదర్శనములుగా మనము గైకొనవచ్చును. వానివలన గలిగినఫలము లేమన.— ఆవివాహసమయములందెల్ల ఘోరసంగ్రామములు జరుగుట భార్యాభర్తృవియోగములు సంభవించుట లోనగునవియై యున్నవి. ఆసంగరములందు వరుఁడు బ్రతికిన వివాహము మఱచ్చిన దశాహమును జరుగుచువచ్చినవి. కాని యీస్వయంవరవివాహములు క్షత్రియేతరసంఘములందు జరుగుచుండెడివనుటకుఁ

దగిన నిదర్శనము లేవియుం గానరావు. ఇప్పుడా స్వయంవర వివాహములను జనసామాన్యమునందు నెలకొల్పితిమేని నెందఱుమరణింపవలయునో వారికై యెందఱుశోకింపవలయునో యావివాహములకేగినవా రెందఱుకారాగారములవసింపవలయునో యెంతధనవినాశము కలుగునో మనమీయెడ నెట్లునిర్ణయింపఁగలుగుదుము? నిర్ణయింపలేము. కాన నీస్వయంవర వివాహములు రాజులకుఁ జెల్లఁదగినవి కాని జనసామాన్యమునం దేమాత్రమును నాచరణలోనికిఁ దీసికొని రాఁదగినవికావు. ఈవివాహముల నెలకొల్పఁ బ్రయత్నించువారు సంఘవినాశకులు గాని సంఘసంస్కారులు గారు.

ఇఁక రెండవతరగతి స్వయంవరవివాహములంగూర్చి ముచ్చటించుకొందము. ఇవి పాశ్చాత్యుల స్వయంవరవివాహములు. వీనినె మనసంస్కర్తలు తమలక్ష్యమునందిడుకొని తలఁచుకొనినపుడెల్ల నుబ్బి తబ్బిబ్బులాడుచున్నారు. పాశ్చాత్యులు తమకన్యలకు వరనిర్ణయమునకు వలయుస్వాతంత్ర్యమిచ్చి నీయిష్టమువచ్చినవరుని వరించుమందురు. వారును దిరిగితిరిగి చూచిచూచి తుదకెవ్వనినో యొకనిఁ బరిణయమగుచున్నవారు. ఈస్వయంవరవివాహములు నీతిబాహ్యములనియు సంఘవినాశకరములనియు విదేశపండితప్రకాండులు వ్రాసినవపలు వ్యాసములు మున్నగునవి వేనోళ్ళఁజాటుచున్నవి. పాశ్చాత్యులునిషిద్ధములని చెప్పుచున్న యీస్వయంవరవివాహములనె మనసంస్కారసోదరులు తమ సంఘమున నెలకొల్పఁజూచుచున్నవారు.

ఇంతటితమయభీష్టమును దీర్చుకొనుటకై మనసోదరులు విదేశములందంతటను స్వయంవరవివాహములె జరుగుచున్నవికాని బాల్యవివాహములుజరుగుటలేదని చెప్పుచున్నారు. ఇదితప్పు. విదేశములలోఁగూడ స్వయంవరవివాహములులేనిదేశములు కలవు. బాల్యవివాహములుగలదేశములుగూడ నున్నవి. ఈవిషయములు సత్యములనుటకుఁగొన్ని సమాచారములను జూపుచున్నారము. చూడుఁడు. సువర్ణలేఖవారపత్రిక సం 1 సంచిక 16 "స్త్రీలవృత్తాంతములు, చీనాబాలికలు" అనుశీర్షిక క్రిందఁ బెండ్లిండ్లు కుదుర్చుటను గూర్చి యిట్లు వ్రాయఁబడియున్నది. "వధూవరులను దలిదండ్రులె నిశ్చయింతురు గాని భార్యాభర్తలస్వయంవరపద్ధతిలేదు" దేశమాత 3-2.15 తేదిగల సంచికయందు "గ్రీసుదేశపుస్త్రీలు" అనుశీర్షికక్రింద వ్రాయఁబడినవ్యాసములో మనదేశమందువలె నాదేశమున బాల్యవివాహములుకలవనుటనుగూర్చి యిట్లువ్రాయఁబడియున్నది. "బాలురకు 15 సంవత్సరములకును, బాలికలకు 12 సంవత్సరములకును శాస్త్రప్రకారము వివాహము చేయవచ్చును"

దీనింబట్టి యితరదేశములలోఁ గొన్నిటియందు స్వయంవరవివాహములు లేవనియుఁ మఱికొన్నిటియందు బాల్యవివాహములుకలవనియుఁ దెలియవచ్చినది. కాఁబట్టి విదేశములం దంతటను స్వయంవరవివాహములె యున్నవి కాని బాల్యవివాహములు లేవని మన సోదరులు చెప్పుట తప్పని చెప్పవచ్చును.

విదేశీయులందువలెనె మనదేశమందును ముందు సుఖదుఃఖంబు లనుభవింపవలసిన వధూవరులు తమమనసునకు నచ్చినవరవధువులను వరించి వివాహమాడుట శ్రేయస్కరముకాని తలిదండ్రులు తమ యిష్టప్రకారము వధూవరులనిర్ణయించి వివాహముచేయుట శ్రేయోదాయకముకాదు" అని కొందఱు వాదించుచున్నారు. ఇదియు విదేశానుభవములేనివారు చెప్పునదియె. చూడుఁడు. సువర్ణలేఖవారపత్రిక సం 1 సంచిక 16 చీనాదేశ వివాహములు "వరాన్వేషణమునను వధువు నెన్నుటలోను కుటుంబగౌరవమును జక్కదనమును వృద్ధులస్వభావమును ముఖ్యముగఁ దలిదండ్రులు పరీక్షించెదరు. తలిదండ్రులయొన్నికను బిడ్డలంగీకరింతురు" వధూవరులు ఒకరికిబ్బందికలుగునని యొకరు సద్దుకొని పోవుదురు. కాన నన్యోన్యము కుదురును" దేశమాత 3-2-16 తేదిగలసంచికను. "గ్రీసుదేశపుస్త్రీలు" "బాలికలకు బాలురకుగూడఁ దలిదండ్రులె వివాహసంబంధము కుదిరింతురు. ఇట్లుకుదుర్చుటవలన దంపతులలో నేకలతలుకలుగుటలేదు" విదేశసమాచారము లీవిధముగాఁ దలిదండ్రులు వధూవరులనిర్ణయించిచేసిన వివాహములవలన నాదంపతులకు నేవిధములగుకలహములు లేక సుఖముగానుందురని చెప్పుచుండగా మనసోదరులు తద్విరుద్ధముగాఁ జెప్పుట విరుద్ధముగానున్నది.

విదేశీయులు స్వయంవరవివాహములవలన వారు మహోన్నతపదవినందినారని తలంచుట రెండవతప్పని చెప్పితిమి. ఆవిషయ మిందున వివరించుచున్నారము. ఈవిషయమై మేము ప్రత్యేకముగాఁ దెలుపుటకన్న మాకంటె సర్వవిధముల నుత్తములును సంస్కృతాంధ్రాంగ్లభాషాపండితులును, దూరదర్శులును లోకజ్ఞానులు నగు బుద్ధిమదగ్రగణ్యు లిదివఱకువ్రాసినవ్యాసములలోనుండిఁ బ్రకృతానుకూలములగుభాగములను నిందుఁ బొందుపఱచినఁ జాలునని యూపనిఁ జేయుచున్నారము. వానిలో ముందు దుర్మర్శక వాగనుశాసనులగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులవారు శ్రీమదార్య మతబోధిని సం 7 సంచికాసముచ్చయమందు "కృష్ణాపత్రిక వింతమూర్ఖత" యనుశీర్షిక క్రింద "యువతీవివాహములముచ్చటంగూర్చి యిట్లువ్రాసియున్నారు.

"ఏమీ! స్వయంవరణభాగ్యమా! అట్టిమహాభాగ్యము హిందూదేశములోని బ్రాహ్మణులకు స్వప్నావస్థయందును లేదు. ఒకవేళ ముందెన్నడైన కలుగవచ్చునేమో

కాని యిప్పటికిలేదు" అని రావుబహాదరు కందుకూరివీరేశలింగముపంతులవారు యువతీవివాహములంగూర్చియు స్వయంవరములంగూర్చియు స్వీయచారిత్రములో ముచ్చటపడఁజొచ్చిరి. వీరుసెలవిచ్చినమహాభాగ్యము మనలోనెప్పుడే పట్టుటకు వలనుపడదు. వేలకొలది విడుదలనిచ్చు న్యాయస్థానములు (Divorce courts) స్థాపింపఁబడినతరువాత యువతుల స్వయంవరమును మనము పెట్టవలయును. వివాహపుటొడంబడికలవిడుదలనిచ్చువ్యాజ్యముల విచారించుటకై యేర్పడిన న్యాయస్థానము లొక్క అమెరికాదేశమందుననే 2921గలవు. ఈమహాభాగ్యము మనదేశమునకుఁబట్టినప్పుడుగదా స్వయంవరమహాభాగ్యము శోభించును. ఎదిగి యుక్తాయుక్తజ్ఞానముసంపాదించుకొనినతరువాత వధూవరులెంచిచేసికొను వివాహములు తుదకు మూన్నాళ్ళముచ్చటలుగానున్నవి. లేకున్న వివాహపుటొడంబడికల విడుదలనిచ్చుట కిన్ని ప్రయత్నములేల? వానివిచారించుట కిన్ని న్యాయస్థానములేల? గోల్డుస్మిత్తను నింగ్లీషుకవిచెప్పినట్లుగా వధూవరుల యానందమంతయు వివాహమాడుటకు ముందేయుండును గాని వివాహమైనతరువాత నుండదు. వివాహమాడఁదలఁచుకొను స్త్రీపురుషులు కొంతకాలమువివాహమునకుముందు కలసిమెలసి తిరుగుదురు. దానికి కోర్టుషిప్పు (Courtship) అనిపేరు. కోర్టుషిప్పులో నిద్దఱికి అనుకూల్యముకలిగెనేని వివాహముచేసికొందురు. లేకున్న లేదు. వివాహమైనతరువాతకంటె నీకోర్టుషిప్పుదినములలోనె యానందమెక్కుడుగానుండునని గోల్డుస్మిత్తుక్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"Being convinced, by experience, that the days of courtship are the most happy of our lives, I was willing enough to lengthen the period."

ఇట్టిభాగ్యమునా మనరావుబహదరువారు మనబ్రాహ్మణులందుఁ గావలెనని కోరుకొనుచున్నారు? చాలు! చాలు!! మనకుఁ గలలోఁగూడ నిట్టివైభవము పట్టకుండుఁగాక. యువతీస్వయంవరములున్నతావుల వివాహధర్మములనుగూర్చియు, ఆస్తినిగూర్చియు సంతానమునుగూర్చియు, విడుదలలంగూర్చియు వధూవరులు సదా న్యాయస్థానముల కెక్కుచుందురు. కన్యావివాహములుగలమనదేశమున నీదోషములు లేవు. ఈ విషయమై జ్ఞాననిధులనిపేర్కొనంబడిన సర్. టి. మాధవరావుగారిట్లువ్రాసియున్నారు

"Facts exceedingly creditable to Hindu society. A multitude of such facts might be categorically stated. The

following are some of them (1) Very rare suits by a husband against the wife for institution or restitution of conjugal rights. (2) There are no suits whatever by a wife against the husband for the institution or restitution of those rights. (3) There are no suits by either against the other for a divorce. (4) Rare are charges of conjugal infidelity brought by either (5) Rare are disputes between husband and wife about property.

హిందు సంఘమునకు విశేషకీర్తిని దెచ్చువిషయములు. ఇట్టివిశేషములరాశి నొకదానిని వరుసగా నీయవచ్చును. ఈక్రిందివి వానిలోఁ గొన్ని (1) వైవాహిక ధర్మములపరివర్తనముకొఱకుఁగాని నివర్తనముకొఱకుగాని భర్త భార్యపైఁదెచ్చువ్యాజ్యములు మిక్కిలి యరుదు. (2) ఈధర్మములపరివర్తన నివర్తనములకై భర్తలపై భార్యలు తెచ్చు వ్యాజ్యములు లేవు. (3) ఒకరొకరిపై విడుదలకై దెచ్చువ్యాజ్యములు లేవు. (4) వివాహసమయభంగములంగూర్చి యుభయుల తగవులును లేవు. (5) సంతానముంగూర్చి తగవులు లేవు, (6) ఆస్తినిగూర్చి భార్యాభర్తలలోఁ గలహములు లేవు.

అని పై యింగ్లీషువాక్యముల తాత్పర్యము. ఈవిశేషము లొక్క హిందూసంఘమునందే గలవని సర్. టి. మాధవరావుగారు వ్రాసియున్నారు. ఇవియన్నియుఁ గన్యావివాహఫలములేయని వధూవరుల నెంచువారు తలిదండ్రులగుటవలన వచ్చిన ఫలములేనియు బుద్ధిమంతులు గ్రహించుకొనవలయును. యువతులు స్వయంవరమున కారంభించిన నీతగవులన్నియుఁ గలుగును. మన్మథుఁడు గ్రుడ్డివాఁడని కవికులసార్వభౌముఁడగు షేక్స్పియరు వ్రాసియున్నాఁడు అట్టిమన్మథుఁడు కూర్చిన వివాహముయొక్క శోభ నడుగవలయునా ?

## పశ్చిమదేశములందలి భార్యాభర్తల పొత్తులు.

భార్యాభర్తల ఐకమత్యవిషయములో మనదేశమే మంచిస్థితియందున్నది. భార్యలనుగొట్టుభర్తలు మనదేశముకంటె పశ్చిమదేశమునందే హెచ్చుగాఁగలరు. ఈవిషయమై మోనియరువిలియమ్సుదొరవారిట్లువ్రాయుచున్నారు.

"The number of wife-beaters is considerably smaller in India than in Europe or America"

(భార్యలనుగొట్టువారు హిందూదేశముకంటె యూరపునందును అమెరికాయందును హెచ్చుగాగలరు.)

స్త్రీని గుణవృద్ధికై మర్దింపవలెనను నింగ్లీషుసామెత యొకటికలదు. దాని నీక్రిందనిచ్చుచున్నాను.—

"A woman, a dog, and a walnut tree, the more they be beaten the better they be"

(స్త్రీయును, కుక్కయును, నక్రోటమును, యెంతమర్దించిన నంతగుణవృద్ధినందును) పశ్చిమదేశములందు భర్తలమర్దింపుభార్యలుపడుగలరు. అదియీదేశమునలేదు ,,

ఇంతియగాదు. ఈస్వయంవరవివాహములు వృద్ధియైనకాలందిని స్త్రీలకు వివాహేచ్ఛ క్రమక్రమముగా సన్నగిలి వ్యభిచారముపాలగుచుందురు. ఈవిషయము నీదిగువనుదాహరించిన సమాచారము ధృవపఱచుచున్నది. చూడుండు ఆర్యమతబోధిని సం9 సంచిక9

,,అమెరికా దేశమునందలి యవివాహితులసంఖ్య,, ,,అమెరికా దేశమునందలి యునైటెడ్స్టేట్సులో వివాహమాడనివారు 17102009జనులుకలరనియు వారిలో వివాహముకాని యౌవనవంతులు 8102000లును యువతులు 9000000లు ననియు జనపరిగణనపులెక్కలవలన నీనడుమ తేలినదట! స్థూలదృష్టిచే కోటిడెబ్బదిలక్షలజనులు వివాహములేకయున్నారని చెప్పవచ్చుననియు నిది మిక్కిలి శోచనీయముగు నవస్థయనియుఁ బత్రికలు ఘోషించుచున్నవి. వివాహధర్మములఁగూర్చియును జాతిహైన్యముఁగూర్చియువిమర్శముచేయువారు లీయంశమును ముఖ్యముగా గమనింపవలయుననియు నీయవస్థ మిక్కిలి నీతిబాహ్యముగానున్నదనియుఁ బ్రాజ్ఞులు నొక్కివ్రాయుచున్నారు- హిందూధర్మశాస్త్రములును క్రైస్తవధర్మశాస్త్రములును బోధించురీతిగా వివాహమునుఆధ్యాత్మికముచేయక పాశ్చాత్యులు దానిని కేవలలౌకికముచేయుటచే నీదోసఁగు పొసఁగుచున్నది. ఇది నాగరికవివాహముల (Civil marriage) వలనిఫలము. మనదేశమునందు వివాహములఁగూర్చి ముచ్చటించువార లీయంశమును ముఖ్యముగా గమనింతురుగాక. వివాహ మింద్రియసుఖ సాధనముసుకొనుట తప్పు. కాన నాగరికవివాహము లెప్పుడును జయమునందవు. ఈయంశమును బశ్చిమదేశపువివాహములు రూఢిఁజేయుచున్నవి. అమెరికాదేశమునందును, నింగ్లాండునందును, వేనవేలు వివాహముచేసికొనకయే కాలక్షేపముచేయుచున్నారు. ఆయాదేశములయందు వివాహ

మపజయమునందుచున్నదని ప్రాజ్ఞులు ఘోషించుచున్నారు'' ఇదేవిషయము సంయుక్త రాష్ట్రములలోని పెండ్లిండ్లు'' అనుశీర్షికక్రింద గృహపత్రిక సం 12 సంచిక 33 లోc బ్రకటింపcబడియున్నది. ఆవ్యాసముచివరను బత్రికాధిపతులు తమయభిప్రాయ మీవిధమున నిచ్చియున్నారు.

„స్త్రీలలోను బురుషులలోను ఎవరో కొందఱు కార్యదీక్షచేతనో వైరాగ్యముచేతనో పెండ్లిలేకయుండవచ్చును. గాని కేవలము స్వేచ్ఛాజీవనముకొఱకు వివాహములేకయుండు నాచారము జనసామాన్యములో వ్యాపించినయెడల దేశమునకుగలుగు హానికి మితముండcజాలదు. వివాహపద్ధతులనుసంస్కరించు వారీవిషయమును బాగుగ యోజించవలసియుండును''

ఇంతవఱకుమీరుకనcబఱచినసమాచారములంబట్టి విదేశీయులకు స్వయంవరవివాహము లనిష్టఫలదాయకములైయున్నవని తెలియవచ్చినది. ఐన నగుcగాక, దాన మనకేమినష్టము! మనదేశీయుల కట్టిమాపద లెన్నటికిని ఘటింపcజాలవు. మనసంఘసంస్కరసోదరులు చాలcడెన్నియోస్వయంవరవివాహములను గావించియున్నవారు. ఆదంపతు లెంతేనిc జూడముచ్చటగా సుఖపడుచు ముందువారికి మార్గదర్శకులైయున్నవారని కొందఱుచెప్పవత్తురేమో? అది యనుభవదూరమైనమాట.

## స్వదేశస్వయంవరవివాహఫలములు.

### కన్యకుగర్భముగుట.

మనదేశమున నవీనాచారపరులు స్వయంవరవివాహనామక విషవృక్షవనమును బెంపొందింపవలెనని పలుప్రయత్నములు గావించి యేదెనిమిదివిషబీజములను నాటిరో లేదో యినికొలcదిదినములలోనే యప్పుడే కొన్ని కాయలుకాచి ఫలములనీయ మొదలిడినవి. ఆఫలములcగొన్నిటిని మీయెదుటcబెట్టుచున్నవారము.

సంస్కృతాంధ్రాఙ్గ్లేయ భాషాపండితులును, ధర్మాధికారివరేణ్యులును బ్రాహ్మణులును దత్త్వవిదులును నగు బ్రహ్మశ్రీ నావిలాలవేంకటశివావధానులు బి. ఎ. గారినిc గొలcదికాలముక్రిందటc గొందఱము దర్శింపcబోయితిమి. ప్రస్తావవశమున స్వయంవరవివాహములముచ్చటరాcగా శ్రీవారు తమయనుభవములోనున్న యొకకథc జెప్పసాcగిరి. అదేమన?

పెద్దయుద్యోగములోనున్న తమమిత్రసత్తముల కొకరికి నిరువురుసుతలుదయించిరcట! అం దొకతనూజాత కెనిమిదవయేడువచ్చినతోడనె యొక సచ్చరితుcడగువరుని

కిచ్చి పరిణయము గావించిరఁట! పిదపఁగొంత కాలమునకు రెండవయాఁతునకును వివాహ యోగ్యకాలము సంభవించినదఁట! అందువలనఁ దమమిత్రులు వరాన్వేషణమునకు నారంభముజేసిరంట! ఇంతలో భగవంతుఁడు ప్రతికూలుఁడై తమస్నేహితునిఁ బరలోకమునకుఁ బంపెనఁట! పిదప వారినారీరత్నము సంఘసంస్కారపక్షమువలంబించితనచిన్ని కొమరితెను స్వయంవరవివాహము చేయుందలంచి రజస్వలయగువఱకు వివాహము చేయదాయినదంట! అటుపైఁ దగువరుని నన్వేషించుచుండగనే యాకన్యకామణికి మూఁడుమాసముల గర్భమేర్పడినదంట! తరువాత నీవిషయమును విని యదివఱకు కాకన్యనువరింపఁదలంచియున్నవరులు దూరదూరముగాఁ దొలఁగిపోసాఁగిరంట! అనంతర మెక్కడ దిక్కులేకున్నదాని కక్కునఁగడే దిక్కన్నసామెతననుసరించి యాకన్యను నాపెయక్కునఁగనికొయిచ్చి వివాహము గావించినదంట. కంటిరా స్వయంవరవివాహవిషవృక్షము నందుఫలించిన మొదటిఫలమిది.

ఇదిరెండవఫలము దీనినిఁగనుఁడు. **1-11-14** తేదిగల సుదర్శనీపత్రికా రాజమున "సంస్కరణవృక్షఫలము" అనుశీర్షికక్రింద నొకసమాచారము దెలుపఁబడియున్నది- ఇది కులభ్రష్టతారూపముగు రెండవఫలము "ఈనడుమ నొకరివిన్యూఇన్స్పెక్టరు గారు తనకూతుఁన కీడువచ్చిన దాఁకఁబెండ్లిచేయకయుండె- బంధుమిత్రులందఱును బిల్లకీడువచ్చుచున్నది బెండ్లిచేయుమని యడుగఁగా "దానిభర్తను నేనెట్లునిర్ణయింపఁగలను, ఈడువచ్చినతరువాత ఎదియో చూచుకొనుఁగాక" యని యుత్తరిచెప్పుచువచ్చెను. అందుచే బంధుమిత్రులందఱును వీరి నెబ్బెట్టుగాఁ జూడఁజొచ్చిరి. ఇట్లు కొంతకాలము గడచిన తరువాత నాకాంత పత్యన్వేషణమునఁ బ్రసక్తయై తనతోఁ జిన్ననాఁటనుండియు నొకబడిలోఁ జదువుకొన్న "తామ్సన్" అను కిరస్తానీవానిని వరించి యాతనికిఁ దన్నిమ్మనితండ్రినిఁగోరెను. అప్పుడు తండ్రిగారు చేయునదిలేక యదివఱకే బంధువులు తన్ను వ్యస్తముగాఁ జూచుచుండుటచే తానుగూడ కిరస్తానీకులములోఁ జేరి తనకూతునువానికిచ్చి పెండ్లియొనర్చెను. స్వయంవరవివాహములయొక్కముచ్చట లివి" ఈముచ్చటను జదువుకొని మన దుగ్గిరాలసూర్యప్రకాశరావుపంతులు బి. ఎ. గారు రవిపత్రికలో "ఈ శాసనము దొరతనమువారి కంగీకారమయ్యెనేని బ్రాహ్మణస్త్రీలు చండాలాది హీనజాతులవారి సంపర్కము నపేక్షించి కులహానిగావింతురు" ని సాతురబ్రాహ్మణులువ్రాసిన మాట సార్థకమైనదని యొప్పుకొని యాసాతురబ్రాహ్మణులను "తమనైసర్గికరాతుసస్వభావమును బ్రత్యక్షము గావించుచున్న బ్రాహ్మణసాతురు" లనిదూషించినందులకుఁ బత్రికాముఖమున క్షమాపణఁగోరుట విధియని తెలుపుచున్నారము.

# ప్రధాన పోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

2. రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

## సహాయులు.

21 మల్లాది కామయ్యగారు, చింతపల్లి జమీందారు సంస్థానం, గుంటూరు.

22 శివపురపు వీరభద్రపాత్రయాజిగారు, సికిందాబ్రాదా

23 చిప్పకుల అప్పయ్యశాస్త్రిగారు, సికిందాబ్రాదా

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు

1 జానపాటి సీతారామయ్యగారు, విలేజిమున్సఫు, దాసరచెర్ల.

2 దండమూడి చినవెంకయ్యగారు, దండమూడి.

3 అనుమంచి హనుమంతరావుగారు, కరణం, గణపవరం.

4 దంటు లక్ష్మీకాంతరావుగారు, గుంటూరు.

5 వేలమూరి సుబ్బారావుగారు, శ్రీమనసభ, కాకినాడ.

6 ధారా వెంకట సుబ్బయ్యగారు, లాపనూపకెంటు, కరేడు.

7 పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు, ప్లీడరు, తెనాలి.

8 ఇయ్యుణ్ణి అనంతపద్మనాభదేశికాచార్యులుగారు, వెంకటరాముని మోరివాని పేట

9 జాలకంటి కోటయ్యగారు, నకరకల్లు.

10 పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు, జగ్గయ్యపేట.

11 దివాన్ బహద్దరు ఎల్లెపెద్ది జానకిరామయ్యగారు, పెన్షన్డ్ డి॥ జడ్జి, బెజవాడ.

12 బెల్లంకొండ రామకృష్ణారావుగారు, పమిడిపాడు.

13 కామమూరు వెంకటనరసింహంగారు, గుంటూరు.

14 ముటుకూరి గోపాలకృష్ణయ్యగారు, కరణం, ముటుకూరు.

15 పిశుపాటి వెంకట నరసింహంగారు, తాలూకాక్లర్కు, బాపట్ల.

16 భువనగిరి కోదండపాణిగారు, సబ్రిజిష్ట్రారు, గుడివాడ.

17 వెలమకన్ని శోభనాద్రిరావుగారు, శోభనాద్రిపాలెం.

18 భాగవతుల గోపాలకృష్ణయ్యగారు, కృష్ణా యాక్ట్రి కాన్సిడ్డిజెన్ ఆఫీసు, బెజవాడ.

19 నూరి పూర్ణానందముగారు, పోలీసు సబిన్స్పెక్టరు, రేపల్లె.

20 డి. మోజెస్.

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు
2. రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

## సహాయులు.

21 మల్లాది రామయ్యగారు, చింతపల్లి సంస్థానం, గుంటూరు.
22 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదు
23 చిప్రుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికింద్రాబాదు

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు

1 జానపాటి సీతారామయ్యగారు, విశేజిమున్సభు, దామరచెర్ల.
2 దండమూడి చినవెంకయ్యగారు, దండమూడి.
3 అనుమంచి హనుమంతరావుగారు, కరణం, గణపవరం.
4 దంటు లక్ష్మీకాంతరావుగారు, గుంటూరు.
5 వేలమూరి సుబ్బారావుగారు, శ్రీ॥మానసభ, కాకినాడ.
6 ధారా వెంకట సుబ్బయ్యగారు, లామసూపరింటు, కరేడు.
7 పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు, ప్లీడరు, తెనాలి.
8 ఇయ్యుణ్ణి అనంతపద్మనాభదేశికాచార్యులుగారు, వెంకటరామునిపోరివానిపేట
9 జాలకంటి కోటయ్యగారు, నకరకల్లు.
10 బాపట్ల లక్ష్మీకాంతయ్యగారు, జగ్గయ్యపేట.
11 దివాన్ బహద్దరు ఎల్లెపెద్ది జానకిరామయ్యగారు, పెన్షన్ డి॥ జడ్జి, బెజవాడ.
12 బెల్లంకొండ రామకృష్ణారావుగారు, పమిడిపాడు.
13 కామమూరు వెంకటనరసింహంగారు, గుంటూరు.
14 ముటుకూరి గోపాలకృష్ణయ్యగారు, కరణం, ముటుకూరు.
15 పిశుపాటి వెంకటనరసింహంగారు, తాలూకాక్లర్కు, బాపట్ల.
16 భువనగిరి కోదండపాణిగారు, సబ్‌రిజిష్ట్రారు, గుడివాడ.
17 వెలమకన్ని శోభనాద్రిరావుగారు, శోభనాద్రిపాలెం.
18 భాగవతుల గోపాలకృష్ణయ్యగారు, కృష్ణాయాన్ట్రిక్సబ్డివిజన్ ఆఫీసు, బెజవాడ.
19 నూరి పూర్ణానందముగారు, పోలీసుసబిన్స్పెక్టరు, రేపల్లె.
20 డి. మోజెస్.